ప్రపంచమతగ్రంథమాల.-అనుబంధదశకము ౧.

ఓమ్



# ఉపనిషత్తులు

(ఈశావాస్య, కేన, ఐతరేయ, ఇత.)

తెనుగు గీతములు, ద్విపదలు, గేయములు.

కర్త

"ఆత్మానందయోగి"





రాజమహేంద్రవరము

ప్రపంచమతగ్రంథమాలా కార్యస్థానము వారిచే

ప్రకటింపబడినది.

 1926 [వెల రు. 0-6.

# ఉద్దేశము

---

సీతిమత ప్రచారమునకై మేము పూనియున్న పనికి సహాయము చేయనెంచి, మాగ్రంథమాలయందీగ్రంథమును బ్రకటింప ననుజ్ఞయిచ్చిన గ్రంథకర్తగారికి మేమెంతయుఁ గృతజ్ఞులము.

సులభమగురీతిని ఉపనిషద్బోధామృతమును బాలురును, స్త్రీలునుగూడ ననుభవించుటకై తేఁటగీతములు, ద్విపదలు, గేయములుగ నీగ్రంథము రచింపఁబడినది.

ఈగ్రంథమూలమున దేశములో జ్ఞానము వ్యాపించెనేని అదియే మాకు పదివేలు.

రాజమహేంద్రవరము,
1—10—26.

ప్రకాశకులు.

1. ఈశావాస్యోపనిషత్తు.

2. కేనోపనిషత్తు.

3. ఐతరేయోపనిషత్తు.

4. కఠోపనిషత్తు.

# ఈశావాస్యోపనిషత్తు.



(తేటగీతలు)

---

జగతియం దెచటఁజూచిన - సర్వదేశ
వర్తియై యీశుఁ డుండుట - వలనఁ గర్మ
ములనువిడిచి యాత్మను బట్ట - వలయు, నెవని
ధనమునైనను గోరఁగఁ - దగద యెప్పుడు.

ఆత్మతత్త్వంబుఁ దెలియ నీ - కలవికాక
యున్నఁ గర్మలఁ జేయుచు - నుంట లెస్స;
కాన, కర్మ బంధనకారి - కానియట్లు
కోరి భువి నూఱువర్షముల్ - గుడువవలయు.

ఆత్మహంతలా నజ్ఞాను - లాసురంబు
లను తమోవృతలోకంబు - లందు, మృత్యు
కాలమునఁ గోరికొను జన్మ - కారణముగ
దేహములఁ దాల్చుచుందురు - తెలివిలేక. ౩

అచలమై యద్వితీయమై - సట్టి యాత్మ
మనసుకంటె జవియమై - మనుట, నింద్రి
యముల కందక దాఁటు; న - న్యాత్మనందు
ప్రాణ మింద్రియంబుల వేఱు - పఱచుచుండు. ౪

అచలమయ్యును జలవమౌచు - నలరుచుండు
దూరమైయుండి దగ్గఱఁ - దోఁచుచుండు
నన్నిటికి లోన వెలయున - దయ్యు నాత్మ
వరలుచుండు వానికి బాహ్య - వర్తియగుచు. ౫

అన్ని భూతంబులను దన - యందు చూచి,
అన్ని భూతంబులందుఁ ద - న్నరసికొనుచు

జ్ఞాని యగునట్టివాఁ డాత్మ - సర్వగతుఁడ
టంచుఁ దెలిసి యెన్నఁడుని నిం - దింపఁబోఁడు. ౬

జ్ఞానియగువాని కెప్పుడు - సర్వభూత
ములును దనయందె కాన్పించి - ముదముఁగూర్చు
నిట్టి యేకత్వమును యెల్ల - యెడలఁ గాంచు
జ్ఞానికిని మోహమేమి? శో - కంబు నేమి? ౭

ఆత్మ తేజస్వి, యశరీర - మవ్రణంబు
శుద్ధమును బాపరహితమౌ - చొప్పుఁదాల్చి
యంతటను వ్యాపనముఁబొంది - యలరుచుండు;
కవియును, మనీషియును, బరి - భువు, స్వయంభు
వైన యీశుండు సర్వజ్ఞుఁ-డగుటఁ జేసి
శాశ్వతబ్రహ్మకల్పముల్ - జరగుకొలఁది
నర్థముల వేఱుపఱచె యా - థార్థముగను. ౮

జ్ఞానమునువీడి కర్మంబు - సలుపువార
లంధకారంబునంబడి - యుందు రెందు,

రంతకంటెం జీకటిం బ్రవే - శింతు రెపుడు
దేవతల నుపాసించెడి - ధీ రహితులు. ౯

జ్ఞాన కర్మల భేదంబు - సరిగ మాకు
నెఱుక చేసిన యాచార్య - లిట్టివిద్య
యొక్క ఫలము, అవిద్య వే - ఱొకటి యిచ్చు
ఫలమనంగ విందు మా ధీర - వరులనుడుల. ౧౦

దేవతాజ్ఞాన మనుదానిం - దెలిసికొనుచు
కర్మవిజ్ఞానమును గూడం - గలుగువాండు
కర్మచేతను మృత్యువుం - గడచిపోయి
యమృతరూపంబు విద్యచే - నందుచుండు. ౧౧

ప్రకృతి మాయాస్వరూపమై - వరలుకతనం
జీకటిం జొత్తు రద్దాని - సేవం జేసి,
మాయవలనను బుట్టు బ్రహ్మంబుం గొలిచి

సంభవముఁదాఁచ్చ బ్రహ్మ యొ - సంగు నొక్క-
ఫలము, సంభవరహిత మ - వ్యాకృతంబు
నిచ్చు వేఱుఫలంబని - యెఱుఁగఁబడియె
ధీరు లాచార్యు లెప్పుడుఁ - దెలియఁజేయ. ౧౩

కార్యరూపుఁడౌ బ్రహ్మను - గలయఁగొలిచి
మఱియు నవ్యాకృతంబును - మదిని నిలిపి
యొకట మృత్యువును దరించి - యొకట మర్త్యుఁ
డమృతరూపంబు నెప్పుడు - నందఁగలఁడు. ౧౪

పూషుఁడా! స్వర్గమార్గంబు - మొగము కప్పఁ
బడియె నీలోని యా స్వర్ణ - పాత్రవలన;
సత్యధర్ముఁడనౌ నేను - సరిగ దానిఁ
గనుఁగొనం దీసియుంచుమయా - కరుణతోడ. ౧౫

ఒంటఁజరియించు పూషుఁడా: - యోయి యముఁడ!
సూర్య! ఓయి ప్రాజాపత్య! - చూతు నిన్ను
కిరణములఁబాసి, తేజస్సుఁ - గ్రించు పఱచి,

నీదు కల్యాణమూర్తిఁ గా - న్పింపఁ జేయు
మయ్య! నీలోని వాఁడ నే - నగుదు నపుడు. ౧౬
పిదప దేహంబు భస్మమై - వెడలియుండ
ప్రాణ మమృతమౌ సూత్రాత్మ - లోనఁ గలియు
ఓం అనుచు నేను స్మరియించు - చుండునటుల
కృతము నెప్పుడు మదిని భా - వించునటుల
ఓయి పరమాత్మ! కాపించు - చుండుమయ్య! ౧౭
నడవు మోయగ్ని! మమ్ము స - న్మార్గమునను
గర్మఫలములఁ జేకూర్పఁ - గలవు నీవు
దేవ! నా కర్మములనెల్లఁ - దెలిసియుందు
వందుచేఁ బాపకర్మల - నవలఁ ద్రోయఁ
గదవె! యిదె నీకు నా నమ - స్కారశతము. ౧౮

ఈశావాస్యోపనిషత్తు
సంపూర్ణము.

# కేనోపనిషత్తు



(గేయము.)



ప్రథమఖండము.

ఏవఁడు ప్రేరేపింప - నీమన స్సీప్సితం
బవలీలఁ బొందునో - యాదిమప్రాణంబు
జవసత్వములఁ గాంచి - సంచరించునో, వాక్కు,
చెవి, కన్నులుం దమదు - చేష్టలం దిరుగునో
తెలుపు మోగురుదేవరా. ౧

చెవికిఁ దా వినికియై - మనసునకుఁ దెలివియై
నోటికిని మాటయై - ప్రాణమును దానయై

యింద్రియంబుల మఱచి - యోఁగు నాయాత్మ యందు
తత్వమెుందును శిష్యుఁడా. ౨

కంటిశక్యము కాదు - మాటశక్యము కాదు
మనసుశక్యము కాదు - మఱిదాని దెలియఁగా
సూటిగా నది నీకు - సూచించుదామంటె
తోఁచకున్నది శిష్యుఁడా. ౩

వ్యక్తమైనట్టి ప్ర- పంచఁబుకంటె, న
వ్యక్తమైనట్టి మూ - లంబుకంటెను మించి
గుప్తమై యది ప్రకా - శించునని మనపూర్వ
ఋషులు చెప్పిరి - శిష్యుఁడా. ౪

వాక్కుచేఁ దెలియంగ - వచ్చునది యది కాదు,
దానిచేతనె వాక్కు - తథ్యముగ వర్తిల్లు,
అదియె సత్యముగాని - యితరమెల్లఁ గాదనుచుఁ
దెలిసికొను మోశిష్యుఁడా. ౫

మనసుచేఁ దెలియఁగా - ననువైన దది కాదు,
దానిచేతనె మనసు - తాఁ బ్రవర్తిల్లు; మఱి
యదియె సత్యముగాని - యిదియెల్లఁ గాదనుచుఁ
దెలిసియుండుము శిష్యుఁడా. ౬

కంటిచేఁ దెలిసికొనఁ - గలుగునది యది కాదు
దానిచేతనె కన్ను - కానఁగా శక్యమగు,
అదియె సత్యముగాని - యిదియెల్లఁ గాదనుచు
నెఱిఁగియుండుము శిష్యుఁడా. ౭

చెవిచేత విని తెలియఁ - జెప్పఁగల దది కాదు,
దానిచేతనె చెవియుఁ - దా వినుచునుండు; నీకె
నదియె సత్యముగాని - యిదియెల్లఁ గాదనుచుఁ
దెలియుమోయీ శిష్యుఁడా. ౮

ప్రాణంబుచే నదియుఁ - బ్రాణవంతముకాదు,
దానిచేతనె ప్రాణ - దానంబు కలుగు; మఱి

యదియె సత్యముగాని - యిదియెల్లఁ గాదనుచు
నిశ్చయంబును దెలియుమా. ౯

ఇదిప్రథమఖండము.

---

ద్వితీయఖండము.

## ద్విపద

కొంచెమైనను దెలిసి - కొంటి వేనియు దాని
మంచిబాగుగఁ దెలియ - మఱిగియుం దేవతల
నుంచికూడను నేర్వ - నూహచేయును మనసు
అంత తెలియును శిష్యుఁడా. ౧
అది నాకుఁ దెలిసెనని - యను బుద్ధిపుట్టు, మఱి
యది తెలియలేదనుచు - నంతకంటెను దెలియు
నది తెలియదని తెలియు - నట్టివాఁడే దానిఁ

తెలియరాదని దానిఁ - దెలియువాఁడే తెలియు,
తెలిసెనని యనవాఁడు - తెలియలేఁ డద్దాని,
తెలిసెనన మూఘులును - దెలియలేదన్న వి
జ్ఞాను లౌదురు శిష్యుఁడా. ౩

జ్ఞానమునఁ దెలిసికొని - సరగ నమృతత్వంబు
నూనియుందురు రాత్మ - యోగమున సామర్థ్య
మూనియుండఁగ దాన - జ్ఞానంబుగలుగు, నది
యమృత మొసఁగును శిష్యుఁడా. ౪

ఇక్కడను దెలిసికొని - యెఱుఁగుదురు సత్యంబు,
ఇక్కడను దెలియకయు - హెచ్చౌను నాశంబు,
ఎక్కడను దానిదగు - నిక్క మదిలోఁ దెలిసి,
యిక్కడను వదలి మఱి - యెక్కడకు పోయినను
అమృతు లౌదురు శిష్యుఁడా. ౫

ఇది ద్వితీయఖండము.

## తృతీయఖండము.

### ద్వి—ప

దేవతల కాబ్రహ్మ - స్థిరమైన జయమిచ్చి
దేవాసురుల నణఁప - దేవతలు నదియుఁ దమ
చేవచేతనె యాత్మ - మహిమచేతనె కల్గె
నని విఱ్ఱవీఁగియుండ. ౧

బ్రహ్మయును వారి యా - జ్ఞానంబుఁ దెలిసికొని
వారియెదుటను దోఁచె - వరతనువుతో, నదియు
వారికిని నెట్టి యా - త్మస్వరూపమొ తెలియ
రాక యుండెను శిష్యుఁడా. ౨

అపుడు వారలు నగ్ని - నడిగి రి“ట్లో జాత
వేద! నే పోయి, యది - యేమిరూపమొ తెలిసి
రావోయి” యన నతఁడు. “నట్టులే” యని యక్షు
దరికిఁ బోయెను వరువున. 3

అట్లు వేగముతోడ - నరుదెంచు నగ్నిం గని,
"ఓయి నీ వెవఁడ"వని - యుంకించి యడుగఁగా,
"అగ్నినోయీ నేను - జాతవేదఁడ నేను"
అని యతనితోఁ బల్కెను. ౪
"అగ్నివైతే నీవు - జాతవేదుఁడ వైతె
యేమి చేయఁగఁగలవో-యెఱిఁగించుమీ" యనఁగ
"భూమిలోఁ గలదంత - బూడిచేసెద" నంచు
నగ్ని యతనికిఁ దెల్పెను. ౫
"అంతవాఁడవె యౌను - వయిన నీతృణమిపుడు
కాల్చుమీ"యని యుంచెఁ-గాల్చుటకునగ్నియును
శక్తియంతయుఁ జూపి - శక్తిచాలక, మఱలి
పోయి, దేవతలకును _ "భూతం బదేదో తెలి
యంగరా" దని చెప్పెను. ౬
అపుడు వాయువుతోడ - ననిరి వారలు "వాయు

"అగ్ని" యంచును నతఁడు - నతిరయంబున నేఁగి
యక్షముందఱ నిలిచెను. ౭

పటువేగమున వచ్చు - వాయువును జూచి "నీ
వెవ్వఁడవో తెలుపు మో-యీ"యనుచునడుగ "వా
యువను నే మాతరి - శ్వుఁడ" నటంచును యక్షు
నకు నాతఁ డెఱిఁగించెను. ౮

"వాయువైతే నీవు - మాతరిశ్వుఁడవైతే
యేమి చేయంగలవో - యెఱిఁగింపుమీ" యనఁగ
"భూమిలోఁ గలదంత - పొందఁగల నే" నంచు
వాయు వతనికిఁ జెప్పెను. ౯

"అంతవాఁడవె యాదు - నయిన నీ తృణ మిపుడు
కదలించుమీ" యనఁగఁ - గడురయంబునఁ దాఁకి
కదలింపఁగా శక్తిఁ - గాన కటు తా మఱలి
పోయి దేవతలకును - "భూతం బదేదో తెలి
యంగరా" దని పలికెను. ౧౦

అంత నింద్రునితోడ - ననిరి వారలు, "ఇంద్రుఁ
డా! పోయి, యది తెలియ-నగునె? నీ"కని పలుక
"అట్టులే" యని వెడలి - యక్షుఁ డంతర్ధాన
మొందియుండుటఁ జూచెను. ౧౧

అప్పు డాయాకాశ - మందు నింద్రుఁడు కాంచె
నతిసుందరంబైన - యాకారమును, హైమ
వతి యనఁగ నుమ యనఁగ-నలరుచుండెడి యువతి
"నమ్మ! తెల్పెదవె యీ-యక్షుఁడెవ్వఁడో" యంచు
నామెఁ దెలియఁగ నడిగెను. ౧౨

ఇది తృతీయఖండము.



చతుర్థ ఖండము.

ద్విపద

"ఓయి! యాతఁడె బ్రహ్మ-ఓయి! యాతనివలన
నే సుమీ యసురుల జ-యించితిరి మీ" రనుచు
నామె తెలుపఁగ బ్రహ్మ-యాతఁడే యని యిందుఁ
డపుడు తాఁ దెలిసికొనెను. ౧

అగ్ని, వాయువు, నిందుఁ-డట్లు దగ్గఱఁ జేరి
యాబ్రహ్మఁ దెలియుటయె-యది కారణంబుగా
ఆ దేవతలకెల్ల-నతిముఖ్యులై యుండి
రంతనుండియు మహిమను. ౨

ఆ మువ్వురలోఁగూడ-నా మహాభూతంబె
యాబ్రహ్మ యని ముందు-అరసియుండటఁ జేసి
యా యిందుఁ డాయగ్ని-యావాయువునకంటె

ఆయింద్రుడును నగ్ని - యావాయువును దెలిసి
నట్టి యాబ్రహ్మంబు - నధిదైవతం బౌచు
మెఱుపువలెఁ గనఁబడుచు - మెఱుపువలె నణఁగునని
తెలిసికొను మోశిష్యుఁడా. ౪

అట్టి యీబ్రహ్మంబు - నధ్యాత్మమని యెడఁద
నరసి యాతనిధ్యాన - మగు నాకు నని, మన
స్సంకల్పముం జేసి - స్మరియింప నది సాధ్య
మగుచుండు నోశిష్యుఁడా. ౫

ప్రాణికోటులకెల్లఁ బ్రాప్తించునట్టి యా
బ్రహ్మంబుఁ దెలిసికొను - వానినే యామెల్ల
ప్రాణులును జేరి యా - బ్రహ్మంబుఁ దెలుపుమని
కోరుచుండును శిష్యుఁడా. ౬

"అయ్య! యీ యుపనిషత్తును దెల్పు" మని నీవు
నడిగితివి; ఆబ్రహ్మ - నరయఁగాఁ దగునట్టి

యీ యుపనిషత్తునే - యతిరహస్యంబైన
దానిఁ దెల్పితి శిష్యుఁడా. ౭
దానిఁ దెలియఁగ బెద్ద - తపను చేయఁగవలెను,
దమముఁగాంచియుఁ గర్మ - తప్పకుండఁగవలెను,
వేదవేదాంగములు - విఖ్యాతసత్యంబు
దాని కిరవులు శిష్యుఁడా. ౮
ఈబ్రహ్మవిద్యఁ దా - నెవఁడు బాగుగఁ దెలియు
నాతండు సంసార - మును దరించి యనంత
మై, శ్రేష్ఠమై యుండు నా స్వర్గలోకాన
నిలుచు, నిలుచును శిష్యుఁడా. ౯

ఇదిచతుర్థఖండము.

కేనోపనిషత్తు సంపూర్ణము.

ఓమ్ తత్ సత్.

---

# ఐతరేయోపనిషత్తు.



## (ద్విపదలు)

## ప్రథమాధ్యాయము.

### ప్రథమఖండము.

ఒక్కఁడే యీయాత్మ - యుండె తొల్దొలుత
చరము నచరముఁ దోఁ - చకయుండె నపుడు;
లోకంబు సృజియింతుఁ - గాకని యప్పు
డాత్మ యాలోచించె - నంతరంగమున. ౧
అంత నీలోకాల నతఁడు సృజించె
నంభస్సును మరీచి - యల మరం బాప
ములను నాల్గింటిని - బొందుగా నప్పు;
డంభస్సనఁ దివి - యాలవాలమగు
నా మరీచికి నిక్క - యంతరిక్షంబు

ఆ మఠంబును బ్రహ్మ యుండు వసించు
ఆపృథ్వీక్రింద నా - రూపంబు లుండు. ౨
లోకంబులను నేను - లోకపాలకుల
సృజియింతు నంచు నూ-హించి యాత్రందు
నుదకంబు లందుండి యొక్క పురుషుని
బుట్టించె సర్వాంగ - పూర్ణుఁ డౌనట్లు. ౩
ఆ పురుషుని యాత్మ - ధ్యానింప నతని
ముఖ మండరూపంబు - పోలిక నుండ
వాక్కు వెల్వడియె నా - వాక్కున నగ్ని;
నాసిక ల్వెల్వడె - నాసికలఁ బ్రాణ;
మా ప్రాణమున వాయు - వపుడు జనించె;
కన్నులు వెల్వడెఁ - గన్నులఁ జక్షు
వా చక్షువుననుండి - యాదిత్యుఁడయ్యె;
చెవులు వెలడ్వెను నా - చెవుల శ్రోత్రంబు
శ్రోత్రమునను దిశల్ - శోభతోఁ బుట్టె;

త్వక్కు వెల్వడియె నా - త్వక్కున లోమ
సంఘంబు; నందు నో - షధివనస్పతులు ;
హృదయంబు పుట్టె నా - హృదయాన మనసు
మనసునఁ జంద్రుండు - మాయగాఁ గలిగె;
నాభి వెల్వడియె నా - నాభి నపాన
మందుండి మృత్యువు - నవుడు తాఁ బుట్టె;
శిశ్నంబు పుట్టెను, - శిశ్నంబునందు
రేతస్సు కలిగెను, - రేతస్సువలన
జలములు పుట్టెను - జయ్యన నవుడు. ౪

ఇది ప్రథమఖండము



# ప్రథమాధ్యాయము.

## ద్వితీయఖండము.

### ద్విపద

శ్రీదేవతలుసృష్టి - నందివిస్తార
సంసార మనియెడి _ సాగరంబునను
పడుచు లేచుచు క్షు - త్పిపాసలఁ బొంది
"అయ్యా! మా కాఁకలి - యయ్యెనన్నంబు
దొరకెడి యిరవును - సరగఁ జూపింపు"
మనిపల్కి రా పూరు - షునిఁగూర్చి యపుడు. ౧
అది విని పూరుషుం - డావును జూపె
నది మాకుఁ బనికిరా - దనిరి దేవతలు!
అంతగుఱ్ఱంబును - నాతండు చూపె
నదియును బనికిరా - దనిరి దేవతలు. ౨
అపుడు మనుష్యుని - నాతండు చూప
నోహహో! సుకృతం బయ్యె - నోయయ్య మనుజుఁ
డెంతయును సమర్థుఁ _ డింతియే చాలు"

నన మాకుఁ దగినట్టి - యాశ్రయంబుఁ
దగఁ బ్రవేశింపుం డ - నఁగ నంతలోన. ౩

అగ్ని వాగ్రూపాన - నాస్యంబుఁ జొచ్చె
నాసికఁ జొచ్చెఁ బ్రా - ణము నౌచు వాయు
వాదిత్యుఁడును జక్షు - వై కండ్లఁ జొచ్చె
దిశలు శ్రోత్రమయి పొం - దెను గర్ణములను
పరఁగ రోమములు నో - షధివనస్పతులు
నై త్వక్కునందున - నావిర్భవించె
నిందుండు మనసౌచు - హృదయంబుఁ జొచ్చె
మృత్యు వపానమై - యేఁగి నాభికిని
జలము రేతసుగ శి - శ్నమునందుఁ జొచ్చె ౪

ఆపూరుషునిఁ గూర్చి - యాఁకలిదప్పి
"లయ్యా! మాకును జూపు - మాశ్రయం" బనుడు
"ఈ దేవతలయందె - యిమ్ముగా మీరు
[illegible]

డనియెం; దామందుచే - తన హవిస్సులను
దేవతలకుఁ బెట్టఁ - దిరముగ నవియు
భాగఁబులం గొని - వర్ధిల్లుచుండు. ౫

ఇది ద్వితీయఖండము

---

తృతీయఖండము.

లోకంబులకును నీ - లోకపాలకుల
కన్నంబు సృజియింతు - నని యాత్మఁ దెంచె. ౧
జలములఁగూర్చి తా - సంకల్పమూన
మూర్తి పుట్టెను; అట్లు పుట్టినమూర్తి
యే యన్నమగుచును - నెసలారుచుండు. ౨
అట్లుసృష్టంబైన - యన్నంబు తన్ను
భక్షించువానికి - భయపడిపాఱ




నాపూరుషుఁడు వాక్కు - నంపి పట్టలేన
నెంచెను; వాక్కు - గ్రహింపలేదయ్యె.
ఆయన్నము నె తిని - యఖిలలోకంబు
తృప్తినిబొందె ను - స్థిరముగా నపుడు. 3

ఘ్రాణంబుఁ బంపుచు గ్రహియింపఁబోవ
ఘ్రాణంబు దానిని - గ్రహియింపదయ్యె;
ఘ్రాణంబుచేతనే - గ్రహియించి దాని
తృప్తినొందెను లోక - మెల్లవేళలను. 4

కంటి చేతను దానిఁ - గాంచఁగఁ బోవ
కన్నులు దానిని - గాంచలేవయ్యె
కన్నులచేతనే - కనుచును దానిఁ
దృప్తినొందెను లోక - మెల్లవేళలను.

చెవిచేత దానిని - జేర యత్నింప
చెవియును దానిని - జేరలేదయ్యె

వీనులచే దాని - వినుచు లోకంబు
తృప్తిఁబొందె ను - స్థిరముగా నపుడు. ౬

త్వక్కుచేతను దానిఁ - బట్టఁబోయినను
త్వక్కునం దానిని - బట్టలేదయ్యె
త్వక్కుచేతన దానిఁ - దాఁకి లోకంబు
తృప్తినిబొందె ను - స్థిరముగా నపుడు. ౭

దానిని మనసుచే - తను బట్టఁబోవ
మనసు దానినిబొందఁ - గన జాలదయ్యె
ధ్యానించి మనసుచే - తనె లోకమెల్ల
తృప్తినిబొందె సు - స్థిరముగా నపుడు ౮

శిశ్నంబుచేఁ దానిఁ - జేర యత్నింప
శిశ్నంబు దానిని - జేరలేదయ్యె
శిశ్నంబు దానిని - జేరియు విడిచి
తృప్తినిబొందె సు - సిరత లోకంబు -

ఆ యుపానంబున - నంద యత్నించి
గ్రహియించె దాని నా - కారణంబునను
ఆ యుపానంబె తా - నన్నాయు వగుచు
నన్నంబును గ్రహించు - నట్టిది యయ్యె. ౧౦

ఏను లేకుండ దే - హేంద్రియాదులును
నెట్లుండునంచు నూహించెఁ దా మదిని
ఎట్లుల నేను దే - హేంద్రియాదులను
బొందఁగలానని - బుద్ధిని దలఁచె.
వాక్కును వానిఁ బి - ల్వఁగనోపనేని,
ప్రాణంబు వాని జీ - వనము నౌనేని,
కన్నులు వానిని - గాంచఁగలవేని
వీనులు వానిని - వినఁగల్గె నేని
త్వక్కుచే నవియును - దాఁకఁబడునేని,
మనసు ధ్యానింపఁగా - ననువయ్యెనేని,
ఆ యుపానంబు న - పానమగునేని.

శిశ్నంబుచేత వి - సృష్ట మగునేని,
ఏను నెవ్వఁడనౌదు - నిప్పుడటంచు
నాపూరుషుఁడు దా - ననుకొనె మదిని. ౧౧
తానప్డు బ్రహ్మరం - ధ్రముఁ జీల్చికొనుచు
నా ద్వారమున దేహ - మందునఁ జొచ్చె;
ఈమార్గమునకె వి - దృతి యని పేరు;
దానినే మఱియు నం - దనమని యందు
రవసథంబులు మూఁడె - యాపూరుషునకు
స్వప్నంబులును మూఁడు - వర్తిల్లుచుండు.
దక్షిణాక్షియునె మో - దటి యవసథంబు
మనసె వర్తిల్లు రెం - డవ యవసథముగ
హృదయంబు మూఁడవ - యిమ్మాడ్కి నుండు. ౧౨
ఆత్మ దేహముతోడ - నైక్యంబునొంది
తాదాత్మ్యభావంబుఁ - దాల్చెఁ దా నపుడు
ఆత్మకంటెను భిన్న - మగుదాని శ్రుతియుఁ

జెప్పెనే? యెట్టులఁ - జెప్పలే దెవ్వఁడు.
తానె యీ లోకరూ - పాన వ్యాపించి
నంటినంచును నాత్మ - యొప్పదికించె. ౧౩

ప్రత్యక్ష మైనట్లు - పరమాత్మ యపుడు
సత్యరూపం బైన - సంసారముగను
వర్తించె; దేవతల్ - వారు పరోక్ష
హితులు తాము పరోక్ష - హితు లౌదు రెపుడు.

ఇది తృతీయఖండము.

ప్రథమాధ్యాయము సంపూర్ణము.



# ద్వితీయాధ్యాయము.

## ప్రథమఖండము

---

పురుషునిలో మొదల్ - బుట్టు రేతస్సు
రేతస్సు సకలాంగ - భృతమైన తేజ
మై యుండుఁ; బురుషుండు - నద్దానిఁ దాల్చు;
దానిని స్త్రీయందుఁ - దడిపి తొల్లింటి
జన్మంబు నొందును - సంసారి యగును. ౧

ఇది ప్రథమఖండము.

---

## ద్వితీయఖండము.

---

రేతస్సు స్త్రీకి వ్యతి - రిక్తంబుగాక
స్వాంగంబులనువలె - నలవడియుండ ౧
నామె యెట్టి యుపాయ - మందంగఁ బోక
స్వాంగంబులనువలె - వర్ధిల్లఁజేయు;

ఇట్లామె రేతస్సు - వృద్ధిఁబొందింప
భర్తయు నామెను - భరియించి సాకి
తనుదాన రక్షించి - కొనును, జన్మించి
నట్టితర్వాత నా - యర్భకు సాకి
తనుదాన రక్షించి - కొను; నిట్లె లోక
మెల్ల సాగుచునుండు నెల్లకాలంబు
తల్లిగర్భమునుండి - తరలివచ్చుటయె
రెండవజన్మమై - యుండుఁ బురుషునకి. ౨

ఇది ద్వితీయఖండము

## తృతీయఖండము.

---

పుణ్యకర్మలకెల్లఁ - బుత్త్రి నధికారిఁ
జేసియుఁ దనకర్మఁ - జేసియు, వయసు
వాలినంతన తా మ -రణమును బొంది

పుట్టును మఱలను; - మూఁడవజన్మ
యిదియని ఋషిచెప్పె - నేర్పడ మునుపు.

ఇది తృతీయఖండము

---

చతుర్థఖండము.

---

గర్భమునందుండి - కనుగొంటి దేవ
తలజన్మలను లోహా - కాల నిర్మితంబు
లైన దేహము లధో - యానంబులైన
యప్పుడు వలఁ జించి - యవతలకేగు
డేగవలెను బైటి - కేఁగుదెంచి తన
గర్భములోనుండి - కడఁకతో వామ
దేవుండు నిట్టులే - తెలిపె నేర్పడఁగ; ౧
ఆ వామదేవుండు - నట్లు తాఁ దెలిసి
యీ శరీరమునుండి - యేఁగి పైలోక

ములఁ బొందు యా భోగ- ములఁ గాంచి యమృతు
డయ్యెఁ దా సమృతుండు - నయ్యె నాతండు.

ఇదిచతుర్థఖండము.

ద్వితీయాధ్యాయము సంపూర్ణము.

---

## తృతీయాధ్యాయము.

### ప్రథమఖండము

---

ఇ ట్లుపాసించెదు - నీయాత్మ యెవఁడు ?
దేనిచే రూపంబుఁ - దాను జూచెడున ?
దేనిచే శబ్దంబుఁ - దా వినుచుండు ?
దేనిచే గంధంబుఁ - దాను మూర్కొనును ?
దేనిచే మాటలఁ - దాను మాటాడు ?
స్వాదు వస్వాదు వె - వ్వం డెఱుఁగుచు ?
ని ట్లుపాసించెదు - నీ యాత్మ యెవఁడు?

# క ఠో ప ని ష త్తు.



## ప్ర థ మ వ ల్లి

విశ్వజిన్నామయజ్ఞంబు - వెలయఁజేసి,
దానిఫలముల నందంగఁ - దలఁచి తనదు
సర్వమున్ ధారవోసె వా - జస్రవసుఁడు;
తనయుఁ డతనికి నచికేతుఁ - డనెడువాఁడు. ౧

బాలుఁడౌ నచికేతుఁ డా - లీల దక్షి
ణలనునిచ్చెడు తండ్రిని - దలఁచికొనుచు
మదిని శ్రద్ధాన్వితుండయి - మాన్యబుద్ధి
యిట్టులని లోనఁ దా విత - ర్కించుకొనియె. ౨

"నీరు లేదు, గడ్డియుఁ గడు - పార లేదు,
పాలు లే, వంగహీనంబు - లాలమంద,

పెట్టివానిని దక్షిణ - లిచ్చి తండ్రి
సౌఖ్యరహితలోకములకుఁ - జనునకాదె ?" ౫

అతఁడు తండ్రిని జూచి, "ఓ - యయ్య! నన్ను
నెవరికిత్తువు? నన్ను నీ - వెవరికిత్తు? "
నని పలుకక, మఱియును - నట్లె యడుగ
నలిగి "మృత్యువునకు నిత్తు - నరయఁ దండ్రి. ౬

"నాకుముం దెందఱో పోయి - నారు; నాకు
వెనుక నింకెందఱో యట్లె - వెడలఁగలరు;
యముని కే నెట్లుపచరింతు? - అతఁడు నాకు
నేమి చేయంగఁగలవాఁడు - నిపుడు తండ్రి! ౭

"పూర్వు లందఱు నెట్టులఁ - బోయినారొ
వరుసఁబోయిరి తరువాతి - వారుఁగూడ,
సస్యజాలంబువలెఁ జచ్చి - సస్యమువలె
మఱల జనియించుచున్నాఁడు - మర్త్యుఁడెపుడు."

“అతిథియై బ్రాహ్మణుఁడు వచ్చి - యగ్నిహోత
గృహమునం దధివసించున; - కీడు లేక
యుండ శాంత్యుపచారంబు - లొనరఁ జేయ
వలయు, జలములఁ దెమ్ము వై - వస్వతుండ! ౭

“ఉపవసించుచు బ్రాహ్మణుఁ - డుండు నెవని
యింట, నాయల్పబుద్ధికి - నెసఁగఁబోవు
సత్యవా, క్కాశ సంకల్ప - సంగతులును,
పుత్త్ర పశువు, లిష్టాపూర్త - ములును నెల్ల. ౮

“బ్రాహ్మణా! అతిథివి, మూఁడు - రాత్రులుపవ
సించితివి నాదుగృహమునఁ - జేతు నతులు;
వంద్యుఁడవు నీవు; నాకును - స్వస్తియగును;
కోరుమా మూఁడువరములు - కొదుగ కిత్తు.” ౯

“నీవు విడిచిన నన్ను శాం - తించి మంచి
మనసుతోఁ గోపమునువీడి - నను నెఱింగి

కొనుచు గౌతముఁ జెప్పటి - కొడుకె యనుచు
ముదముసం జూచుటయె నాకు - మొదటివరము."

"స్మృతిగలిగి నాయనుజ్ఞను - మఱిసి గోప
మెల్ల వీడి మృత్యుముఖప్రి - సృష్టు నిన్నుఁ
జూచు నెప్పటివలె సుఖ - సుప్తి నొందు
నిశల నౌద్దాలకియు నారు - ణియును దండ్రి." ౧౧

"స్వర్గమున నీవు లేకుంట - జరయుఁగాని
భయముఁగాని లే వచట, పి - పాస క్షుధయు
రెండులేవు; శోకంబుఁ ద - రించి, స్వర్గ
మందు సౌఖ్యపరిపూర్ణులై - యలరుచుంద్రు." ౧౨

"అమృతరూపంబులను స్వర్గ - మందు నుందు
రట్టి స్వర్గముఁ జేర్చెడి - యగ్ని నీవ
యెఱుఁగుదువు; రెండవవరంబు - నిమ్ము దాని
జ్ఞానమును మృత్యువా! విందు - శ్రద్ధతోడ." ౧

"బుద్ధిగుహాంతో నిగూఢమై - పొదలి స్వర్గ్య
మై యనంతలోకాప్తియగా - నగ్నిఁ జెపుదుఁ
దెలిసికొనుమయ్య నచికేత! - తెలిసికొనుచు
జన్మరాహిత్యసిద్ధిని - సరగఁ గొనుము" ౧౪

లోకముల కాదియగు నగ్ని - నేకరణిఁ
పేర్పవలయు నిట్టుక లెన్ని - పెట్టవలయు
నంతయును జెప్ప నచికేతుఁ - డప్పగింప;
తుష్టుఁడై మృత్యు వాతని - తోడఁ బల్కె. ౧౫

అమ్మహాత్ముఁడు బ్రీతుఁడై - యాపుడు, "మఱల
నిచ్చెద వరంబు నియ్యగ్ని - యెపుడు నీదు
పేర వర్తిల్లు; ఈ రత్న - హారమును న
నేకవర్ణాత్మకంబు గ్ర - హింపు" మనియె. ౧౬

"వసుధ ముమ్మాఱును నచికేత - వహ్ని వేల్చి
* మువురితో ననుసంధించి - మూఁడుకర్మ

---

* మాతా పిత్రాచార్యులు, యాగాధ్యయనదానములు.

లోనరుచుచు జన్మమృత్యువు - లను దరించు;
దేవు సర్వజ్ఞు నాథ్యుని - దెలిసి చూచు
వాఁడు శాంతి నత్యంతముఁ - బడయఁగలఁడు. ౧౭

"వసుధ మమ్మాయి నచికేత - వహ్ని వేల్చు
వాఁడు * మూఁడవువానిని - వరుసఁ దెలిసి
నాచికేతాగ్నిఁ బూజించు - నాఁడు మృత్యు
పాశముల వీడి సుఖియించు - స్వర్గమందు. ౧౮

"స్వర్గ్యమౌ నగ్ని యిది కోర్కెఁ - బడసినాఁడ
విచ్చితిని రెండవవరంబు - నింకమీఁద
జనులు దీనిని నీపేర - జపుపుచుంద
రయ్య! నచికేత చెప్పుము మూఁడవవరంబు. ౧౯

"మనుజుఁడు గతించ నాత్మయు - మరల నుండు
ననుచుఁ గొందఱు; ఉండద - టంచుఁ గొంద

* యాగాధ్యయన దానములు

అందు; రీ సందియమునెల్ల - అయ్యొ! నీవ
తీర్పవలయు ఇదియె నా తృ - తీయవరము. ౨

"మునుపు దేవతలకుఁగూడఁ - బుట్టె నిట్టి
సందియము; కాని, యిదియు సు - సాధ్యమగునె?
యించుకేనియు? గాన, వ - రింపు మన్య
వరము; నచికేత! వలదు ని - ర్బంధ మిపుడు" ౨౧

"దేవతలుఁ దలపోసిరి - దీనిఁ గూర్చి;
అదియు దుర్జ్ఞేరేయ మంటివి; - అట్టి దీని
బోధఁజేయు నన్యుని నేను - బొందఁగలనె?
తెలియఁదగినది మృత్యువా! - కలదె యొండు?"

"ఆత్మజులను బౌత్రులను శ - తాయువులను
బశువు లేనుఁగులు, ధనంబు - వాజులెన్ని
యైనఁ గోరుము భూమి న - త్యంతభూతి
నెన్నియేం డుండఁగోరెదో - యెంచికొనుము. ౨౩

"ఓయి నచికేత ! దీనికి - సదృశమైన
విత్తమును జిరజీవిత్వ - మిత్తుఁ జుమ్మి
ఈ మహాభూమిఁ జిరము వ - ర్ధిల్లుచుండు
మెల్లకామంబులను గోను - మింపుమీఱ. ౨౩

"మర్త్యులకు దుర్లభంబులౌ - మహితకామ
ములను నీ కిష్టమౌవానిఁ - బోలనిత్తు
సరథలు సతూర్యలౌ రామ - లరుదుకారె
వారు మర్త్యులకును బొంద ? - వీరి నిత్తు,
వారిచేఁ బరిచర్యలఁ - బడయుమయ్య
నీవు మరణంబుఁగూర్చి ప్ర - శ్నింపవలదు. ౨౪

"అంతకా ! భోగము లవెల్ల - యువయువముల
తేజమును జీర్ణమొనరించు - దీనిమించి
జీవితము నల్పమౌఁ; గాన, - నీవె కొనుము,
వాహములు నృత్యగీతముల్ - వలదు నాకు. ౨

"ధనము గల్గునుగాని తృ - ష్ణను ద్యజింపఁ
జాల; మీ వీక్షుఁడవుగ మ - మ్మేలుటలను
జూచితిమయేని జీవంబు - సుస్థిరమగుఁ
గాని, రేఁ గోరువర మదొ - క్కటియె సుమ్ము.
జనుఁ డధోగతుఁడై క్షీణ - తను భజించు
ననుచు, జీవిత మల్పంబ - టంచుఁ దెలిసి
శాశ్వతం బమర్త్యంబగు - చక్కి వదలి
యప్సరసల సంభోగంబు - నరయునొక్కొ! ౨౮
"స్వర్గలోకంబునం దిట్టి - సందియంబు
గలిగె; నద్దానిఁ దీర్పంగ - వలయునయ్య
మృత్యువా! అతిగూఢమౌ - నిట్టివరము
కంటె నచికేతునకు నొండు - గలదె చెపుమ?" ౨౯

ఇది ప్రథమవల్లి.

# ద్వితీయ వల్లి.

---

"ప్రేయ సొక్కటి, శ్రేయస్సు - వేఱయొకటి ;
ఉభయమును భిన్నఫలముల - నొసఁగి, పురుషు
బంధనముచేయు; శ్రేయస్సుఁ - బడయువాఁడు
పొందు మేలు; ప్రేయఃకామి - యొందుచెడుగు. ౧

జనుఁడు ప్రేయస్సు శ్రేయస్సు - ననెడు రెండుఁ
బడయు; ధీరుఁడు వాని నే - ర్పఱచుకొనును;
ప్రేయమును వీడి శ్రేయ మే - వెదకు ధీరుఁ ;
డలసుఁ డాత్మలాభార్థి ప్రే - యస్సుఁ గోరు. ౨

"అట్టియెడ నచికేత! ప్రి - యంబులైన
యిష్టకామంబు రూపంబు - లించుకైనఁ
గోరవైతివి; ధనము సం - సారమగ్న
లెల్లఁ గోరఁగ నీస్పృంక - నెడవిడచితి. 3

“విద్యయు నవిద్యయును రెండు - భిన్నములయి
భిన్నఫలదంబులయి యుండు ; - వీనిలోన
విద్యనే నచికేతుండు . వేడువాఁడ
టంచుఁ గామలోభుండు గాఁ - డనుచుఁ దలఁతు. ౪
“తిరుగుచు నవిద్యలోపల - ధీరులమని
పండితంమన్యులౌ మూఢ - వర్గ మెప్పు
డంధులంబట్టి తిరిగెడు - నంధులవలె
నిట్టులట్టులఁ దాము భ్ర - మించుచుంద్రు. ౫
“బాలుఁడై విత్తమోహాని - బద్ధుఁడైన
మూఢునకు సాంపరాయపు - బుద్ధి యొసఁగ
దిదియెలోకంబు మఱి లోక - మేదియు లేద
టంచు నాచేతఁ బడు జనుం - డహరహంబు. ౬
“పెక్కు రేయాత్మననుగుఱించి - వినఁగఁజాల
రట్లు వినియుఁ బెక్కురు తెలి - యంగఁజాల
రట్టిదానిని జెప్పువాఁ - డరుదు; నిపుణుఁ

డై గ్రహించెడివాఁడును – నరుఁడు; గురువుఁ
బట్టి బాగుగఁ దెలిసిన – వాఁడు నరుఁడు. ౭

"హీననరుఁ డెంత చెప్పిన – నెంత చింత
చేసినను నాత్మ యిది సువి – జ్ఞేయమగునె?
అణువుఁ బోలుటచే నత – ర్క్యము నణీయ
మగుట బ్రహ్మజ్ఞునకె దాని – నరయవశము. ౮

"ఇట్టిమతిని దర్కముచేత – నేఁగఁ బొంద
నలవికా, దొక్క యాచార్యు – వలన నెన్న
గాఁ దెలియవచ్చుఁ బ్రియతమా! – నీదు సత్య
ధృతుల కచ్చెరువయ్యె; ఈ – రీతి నడుగు
వాఁడె నచికేత! యోగ్యుఁ గా – వలయు నెపుడు. ౯

"కర్మఫల మనిత్యంబను – మర్మ మెఱిఁగి
అధ్రువము ధ్రువముం గూర్ప – దనుచు నెఱిఁగి
అస్థిరంబుల నాచికే – తాగ్ని వేల్చి
ఇట్టి పదవిని బొందితి – నిదియు ఘనమె? ౧౦

"కామములకు ఫలంబు జ - గత్ప్రతిష్ఠఁ
గర్మఫలము భయద మాత్మ - గతి ననంత్య
మభయదం బతివిస్తార - మమరఁ జూచి
ధీర ! నచికేత ! వదలితి - ధృతివలిర్ప. ౧౧
"గూఢమై దుర్నిరీక్ష్యమై - * గుహావసించి
తెలియ శక్యంబుగాక సు - స్థిరత సర్వ
ఘాతవర్తియై అధ్యాత్మ - మున లభించు
నాత్మఁ దెలిసి విడుచు శోక - హర్షములను. ౧౨
వినుచు దీని గ్రహించుచు - వేఱుపఱచి,
ధర్మ్య మణువును నైన యా - త్మను భజించి,
మోదనీయము జనుఁడొంది - మోదమందు;
వత్స! స్వర్గము నీకు న - పావృతంబు. ౧3
"ధర్మము నధర్మమును గాని - దాని, కార్య
కారణములకు భిన్నమై - కలుగుదాని,

* బుద్ధియను గుహ.

భూతమున భవిష్యత్తునఁ - బొదలనట్టి
దాని నీవు చూతువు; నాకు - దానిఁ జెపుము." ౧౪
"సర్వవేదములును దేని - సన్నుతించు
సర్వతపములు దేనికై - సలుపుచుందురు
దేనికై బ్రహ్మచారులై - తిరుగుచుందు
రదియె "ఓమ్" అను పదమని - యరయుమయ్య. ౧౫
"ఓమ్ అనెడు నక్షరమె బ్రహ్మ; - ఓమ్ అని యెడ
నక్షరమె పర; మో మ్మను - నక్షరమునె
తెలిసికొని యెవ్వఁ డెద్దాని - వలచుచుండు
దానిఁ దప్పక పొందును - తథ్య మిదియు. ౧౬
ఏతదాలంబనమె శ్రేష్ఠ - మిదియె పరము;
ఇట్టి యాలంబనము మది - నెఱుఁగువాఁడు
బ్రహ్మలోకంబునం బూజ్య - పదవి నొందు. ౧౭
జ్ఞానరూపమౌ నాత్మకు - జననమరణ
ములును గారణమును లేవు; - పుట్టలేద

ఁపుదియు; నిత్యము, శాశ్వత - మజమునై, పు
రాణమై, నశింపదు శరీ - రంబు చెడిన. ౧౮

చంపువాఁడు చంపితినని - చంపఁబడిన
వాఁడు చచ్చితినని తలం - పఁగ నిరువురు
జ్ఞానహీనులె యగుదురు; - చంపుటయును
చంపఁబడుటయు నాత్మకుఁ - జనదు చెప్ప. ౧౯

అణువుకంటెను నణువు, మ - హత్తుకంటె
మహిమగా నాత్మజంతువు -* గుహను నిలుచుఁ
గామ్యకర్మరహితుఁడు శో - కముఁ దరింది
ధాతవరమునఁ దెలియు నా - త్మయె ఘనమని. ౨౦

కదలకుండియు దూరము - కదలిపోవుఁ,
బండుకొనియును నంతటఁ - బర్వుచుండు,

---

* బుద్ధియను గుహ.

మదము నమదంబు నైన యా - త్మను మదన్యుఁ
డెవఁడు తెలియంగఁగలవాఁడో - యొంచి చెప్పుము!

దేహమనవస్థితం; బుండు - స్థిరత నిలిచి,
దేహరహితమై, మహితమై - తేజరిల్లి
విభువయిన యాత్మఁ దెలియుచు - వేడ్కతోడ
శోకమును ధీరుఁ డెప్పుడుఁ - జూడఁబోఁడు. ౨౨

ప్రవచనంబున, మేధస్సు - వలన, శాస్త్ర
జాలమున, ఆత్మ లభ్యమై - యేలయుండు?
సాధకుం డెట్లు దానిని - సాధ్యపఱచు
కొనునో, అట్టులె యది వాని - కిని లభించు. ౨౩

దుష్టచరితుఁ, డశాంతుండు - తుష్టి లేని
వాఁడు, నిష్ఠయు లేనట్టి - వాఁడు, ఆత్మ
తత్త్వమును బొందఁ జాలఁడు - దాని నధిక
జ్ఞానముననె సంపాదింప - సాధ్యమగును. ౨౪

ఆత్మకును బ్రాహ్మణును క్షత్రి - యన్నమగును;
మృత్యు వుపసేచనంబగు; - మిగుల నదియు
నెట్టిదియొ యెక్కడిదో కూడ- నెఱుఁగవశమె?_౨౫

ఇది ద్వితీయవల్లి.

---

## తృ తీ య వ ల్లి.

---

క్రియలఁ బంచాగ్నులఁ ద్రినాచి - కేతులైన
బ్రహ్మవిదులు కర్మములకై -ప డయు నాత్మ,
గుహను బరముఁ బరార్థమై - పడయు నాత్మ,
వసుస నుపమింతురు ఛాయాత - పంబు లనుచు. ౧
అక్షరముఁ బరబ్రహ్మమై - యాగపరుల
కెద్ది సేతువుఁబోలెఁ దా _ నెసఁగుచుండు

# తృతీయవల్లి

దవిలి సంసారముఁ దరింపఁ - దలఁచు వారి
కభయపారము నాచికే - తాగ్ని తెలిసె.
ఆత్మను రథస్థుఁడంచును - నరయవలయు,
దేహమును రథమటంచును - దెలియవలయు
బుద్ధి సారథి యను నూహఁ - బొందవలయు,
నల మనస్సు కళ్ళెమటంచుఁ - దలఁపవలయు.

ఇంద్రియములు హయంబు; లా - యింద్రియంబు
లందుఁ గనఁబడునవి విష - యంబు లగును ;
ఆత్మ, యింద్రియములు, మన - స్సమరఁగూడి
భోక్త యగునని తెలియఁజె - ప్పుదురు బుధులు.

అనయము సమాహితము కాని - మనసుతోడ
నెవ్వఁ డవివేకియై యుండు, - నిట్టివాని
కింద్రియంబులు సారథి - కెపుడు లొంగ
నట్టి దుష్టాశ్వములవలె - నవశములగు.

అనయము సుసమాహితమైన - మనసుతోడ
నెవ్వఁడు వివేకియై యుండు - నిట్టివాని
కింద్రియంబులు సారథి కెపుడు లోఁగు
నుత్తమాశ్వములవలె స్వా - యత్తము లగు. ౬

అనయ మమనస్కుఁ డశుచియు - నైనవాఁడు
జ్ఞానరహితుండుఁ బూర్వోక్త - మైన బ్రహ్మ
పదము నొందక సంసార - వాంఛఁ గొనును. ౭

పరగ సుమనస్కుఁడును, శుచి, - జ్ఞానవంతుఁ
డైనవాఁడె, యా పదముఁ దా - నధిగమించి
యచటనుండి సంసారంబు - నందఁబోఁడు. ౮

ఎవఁడు విజ్ఞానసారథి, - ఎవనిమనసు
ప్రగ్రహముఁబోలె నింద్రియ - గ్రహ మొనర్చు,
అతఁడు సంసారపారంబు - నధిగమించి
పరమవిష్ణుపదంబును - బడయఁగలఁడు. ౯

# తృతీయవల్లి

అర్థములు హెచ్చగును ఇంద్రి - యములకంటె
అర్థములకంటెను మనస్సె - యధికమగును;
మనసుకంటెను బుద్ధియె - మహితయగును;
ఆత్మ బుద్ధికంటెను గడు - నధికమగును.

అధిక మవ్యక్తమౌను మ - హాత్తుకంటె;
పురుషుఁ డవ్యక్తమునకంటెఁ - బరుఁడు; పురుషు
కంటె బరమైన దింక నొ - క్కటియు లేదు;
కాష్ఠ యదె, పరమంబగు - గతియు నదియె. (

సర్వభూతంబులందును - సంచరించు
నిట్టి యాత్మ నిగూఢమై - యుంచుకేని
కనఁబడదు; సూక్ష్మదర్శుల - కంటఁ బడును. (

వాక్కును మనస్సునందుంచి, - వరుస నా మ
నస్సు బుద్ధ్యాత్మకును నర్ప - ణంబు చేసి,
మహితకర్త్రాత్మలో బుద్ధి - మరగఁ జేసి,
దాని శాంత్యాత్మలోపల - దాఁపవలయు. (

లెండయా! మేల్కొనుండయ్య! - లేచి, శ్రేష్ఠ
గురువుఁ గొని వివేకంబునఁ - గొనుఁడు దాని;
కత్తి యంచునువలె వాఁడి - కల్గునట్టి
యాత్మమార్గము దుర్గమం - బందురు కవులు. ౧౪

శబ్దమునకును భిన్నమై, - స్పర్శరూప
ములకు వేఱయి, అవ్యయ - ము, నరసంబు
నోచు, నిత్య మగంధంబు - నై, యనాద్య
నంతమై, మహత్తునకంటె - నధికమై, ధ్రు
వం బయినదానిఁ గొనువాఁడు - బాయు మృతిని.

నాచికేతంబయిన యీ స - నాతనకథఁ
జెప్పె మృత్యువు, దీనిని - జెప్పువాఁడు,
విన్నవాఁడు, మేధావియై - వెలయుచుండు,
బ్రహ్మలోకంబున న్మేటి - పదము నొందు. ౧౬

పరమమును గుహ్యమైన యీ - ప్రథితకథ నె
వండు పరిశుద్ధుఁడై చెప్పు - బ్రాహ్మణసభ
నైన, శ్రాద్ధకాలంబున - నైన, నతఁడ
నంతఫలముల నెప్పుడు - నందఁ గలఁడు. ౧

ఇది తృతీయవల్లి

## చతుర్థవల్లి

---

ఇంద్రియంబుల బ్రహ్మ సృ - జించె విషయ
భూతముల; అవి విషయముల్ - పోలఁజాలు;
అవియుఁ జూడంగఁజాలవ - యంతరాత్మ
నమృతుఁడగుటకు ధీరుఁడ - య్యవి త్యజించు
బాహ్యసౌఖ్యములం గోరి - బాలుఁ డెపుడు
యమునిపాశంబులకు గుఱి - యగుచు నుండు;

ధ్రువమయిన దమృతత్వ; మ - ధ్రువము లెల్ల
వర్జనీయంబులనుచు ధ్రు - వంబ కోరు
ధీరుఁ డన్యంబు మదిలోనఁ - గోరఁ బోఁడు. ౨

స్పర్శమును, రూప, రస, గంధ, - శబ్దములును,
భోగములు దేలిచేఁ జూడఁ - బోలు నదియె
యిద్ది; ఇఁక మిగిలినది మ - ఱెద్ది గలదు?
నీవు ప్రశ్నించినది యిదే - నిశ్చయంబు, ౩

స్వప్నమందున జాగ్రద- వస్థయందు
సగపడఁగఁ జేయు నెద్ది యా - యాత్మ విభవ
మహితమగుదానిఁ దెలుపుచు - మహాని ధీరుఁ
డెపుడు శోకముఁ గడచి సు - ఖించుచుండు. ౪

కర్మఫలముల భుజియింపఁ - గర్తయగుచు
జీవరూపమునను నాత్మ - చేత మూఁడు
కాలములు శాసితంబులౌ - లీల ననుచుఁ

# చతుర్థవల్లి

దెలియు వాఁ డాత్మరక్షకై - తిరుగఁబోఁడు;
నీవు ప్రశ్నించినది యిదే - నిశ్చయంబు.

పూర్వ ముదకంబులందునఁ - బుట్టినదియు,
బ్రహ్మచే నిర్మితంబయి - పరఁగుచుండు
నదియు, బుద్ధిగుహాంతర - మందుఁ జొచ్చి
భూతములతోడ వెలసెన - పూర్వముగను;
నీవు ప్రశ్నించినది యిదే - నిశ్చయంబు.

అదితియుం దేవతామయ - మగుచుఁ బ్రాణ
ములను గూడుచు, నెయ్యది - పుట్టియుండె
బుద్ధిగుహను బ్రవేశించి - భూతరాశి
యందు నెయ్యది ప్రభవించె - నదియె యిదియు

గర్భిణులు లెస్సగ ధరించు - గర్భమువలె
నరణులం బొంకముగను నే - యగ్ని యుండు,
దినదినము జనుల్ జేసి ను - తింతు రాజ్య
మాదిగా హవిస్సుల వేల్చి, - అదియె యిదియు.

తరణి యొందుండి పుట్టు, న - స్తంగతుండగు
నెందు, సర్వదేవతలును - నందె యుందు,
రది గడువనేరం డెవ్వండు - నట్టి బ్రహ్మ
మే సుమీ నచికేత! ప్ర - శ్నించినదియు. ౯

ఇహమునం బరమందున - నెసంగునట్టి
రెండు నొక్కటియై యొప్పు - చుండు సుమ్మి;
అట్టి పరమంబునం దైక్య - మొంద లేని
వాండు మృత్యుపునకుం బాలు - పడుచు నుండు. ౧౦

మనసుచేతనె దీనిం బొం - దంగవలయు;
దీన నానాత్వ మింతక .. యైన లేదు;
ఎవ్వం డిందు నానాత్వ మీ - క్షించుచుండు
నతండు మృత్యువునకు వశుం - డగుచునుండు. ౧౧

పురుషుం డంగుష్ఠమాత్రుండై, - భూత భవ్య
[illegible] - మున వసించు.

అందుచే నాత్మరక్షణ - నందఁబోకు;
నీవు ప్రశ్నించినది యిదే - నిశ్చయంబు. ౧
పురుషుఁ డంగుష్ఠమాత్రుఁడై - పొగయులేని
యగ్నిఁబోలెను యోగుల - కగపడుచును
భూతభవ్యంబులకుఁ దా వి - భుండగుచును
నేఁడు రేపును నెప్పుడుఁ - జూడఁబడును. ౧
ఉన్నతస్థలి వర్షించు - నుదక మచల
ములను బారుచు నశియించి - పోవునటుల,
ఆత్మధర్మములను దా న - నాత్మధర్మ
ములని నరుఁ డెంచి సంసార - మునఁ జరించు. ౧
శుద్ధజలమునఁ గలసి వి - శుద్ధమైన
జలముపోలిక నాత్మ వి - జ్ఞానలబ్ధి
నాత్మశుద్ధిని గౌతమా! - యందు మునియు. ౧

ఇది చతుర్థవల్లి.

కఠోపనిషత్తు

## పంచమవల్లి

పదునొకండుద్వారంబులఁ - బరఁగు పరము
వక్రిచేతను నజునిదై - వరలుచుండు;
అట్టి పరముని ధ్యానించి - యఖిలశోక
మును దరించి, సంసార వి - ముక్తుఁ డగును
నరుఁ; డిదే నీవు ప్రశ్నించి - నదియు సుమ్ము. ౧

అంతరిక్షంబునందున్న - హంసుఁడైన
ఆకసంబునఁగల వాయు-వైన, భూమి
యందుఁగల యగ్నియైన, గృ - హంబులందు
అతిథియు, న్నర, దేవతా - ఋతములందు
వ్యోమమం దున్నయావియెల్ల - నుదక, భూమి,
యజ్ఞ, పర్వతములఁ బుట్టు - నఖిల విశ్వ
మాపరబ్రహ్మమును సత్య - మగుచు వెలయు. ౨

ప్రాణ మూర్ధ్వభాగమున న- పానమును న
ధోగతిగఁ బంపి యెవ్వఁడు - శోఁచు, హృదయ
మందు వామనరూపంబు - నంది యతని
భావనము చేతు రా సర్వ - దేవతలును. ౩

దేహిస్థయై, దేహగతుఁడయి, - దేహముక్తి
నొంది, విడిపోవు నీయాత్మ - యంచునైన
నింక నేముండు; ఇదియె ప్ర-శ్నించినదియు. ౪

ప్రాణమును నపానమును జీ - వంబునకును
హేతువులు కావ; ఆరెండు - నెందు నాశ్ర
యించు నాయాత్మచేత జీ - వించు నరుఁడు;
నీవు ప్రశ్నించినది యిదే - నిశ్చయంబు. ౫

అయ్యా! చెప్పెద నీకు గు - హ్యము సనాత
నంబు, బ్రహ్మంబు నగుచును - నలరు నాత్మ
మరణ మెట్లొందునో గౌత - మా! యదెల్ల. ౬

స్వీయకర్మంబు జ్ఞానంబుఁ - జేసికొన్న
జీవు లాయాయి యోనులఁ - జెందుచుండి
దేహములఁ బొందు, నింకఁ గొన్ని - స్థిరతఁ దాల్చు
సుషుప్తియందున్న జీవులఁ - జొచ్చి, కామ
ములను బురికొల్పి, మేల్కొల్పి - వెలయుచుండు
నట్టిపురుషుఁడు పరిశుద్ధుఁ - డతఁడె బ్రహ్మ
యతఁడె యమృతుం డనెడుపేర - నలరుచుండు;
నతనినే సర్వలోకంబు - నాశ్రయించు,
నెవ్వఁడును నాతని నతిక్ర - మింపలేఁడు;
నీవు ప్రశ్నించినది యిదే - నిశ్చయంబు. ౮
అగ్ని యొక్కఁడె లోకంబు - నందు జొచ్చి
వివిధరూపంబులం బొంది - వెలయునట్లు
వివిధరూపంబులం బొంది - వేఱువేఱ
నగపడును సర్వభూతాంత - రాత్మ యొకఁడె. ౯

వాయు వొక్కఁడె లోకంబు వలనఁజొచ్చి
వివిధరూపంబులం బొంది - వెలయునట్లు
వివిధరూపంబులం బొంది - వేఱువేఱ
నగపడును సర్వ భూతాంత - రాత్మ యొకఁడె. ౧౦
సర్వలోకంబులకును దాఁ జక్షువగుచుఁ
జాక్షుషంబులౌ బాహ్యదో - షముల చేత
నంటఁగారాని యా సూర్యు - నట్లె, దుఃఖ
బాహ్యుఁడగుచును దుఃఖంబుఁ - బడయఁబోక
యలరు నొక్కఁడె సర్వభూ - తాంతరాత్మ. ౧౧
సర్వమును దనవశమందు - జరపి యొక్కఁ
డగుచు నలరెడు సర్వభూ - తాంతరాత్మ
వ్యక్తముం జేసె నవ్యక్త - మందునుండి;
అతని నాత్మస్థుఁ దెలిసిన - యతఁడె యెపుడు
సౌఖ్యమందు; అన్యుని కది - సాధ్యపడదు. ౧౨
అస్థిరంబులలోన ని - త్యత భజించు
చేతనంబులౌ వానిలోఁ - జేతనుఁడయి

ఎక్కుఁగాఁ గనంబడుచోట్ల - నొక్కఁడగుచు
కోరికలఁ బురికొల్పును - మీఁటి హృదయ
వర్తియౌ వానిఁ జూచెడి - వారె ధీరు,
లట్టివారికె శాశ్వతం - బైనశాంతి
కలుగు; ఇతరుల కా శాంతి - కలుగఁబోదు. ౧౩
అట్లనిర్దేశ్యమై పరం - బైన సుఖము
నిదియె యనుచును దెలియఁగ - నెట్టులగును ?
అదియుఁ దెలియంగఁజెప్ప స్వ - యంప్రకాశ-
మో విశేషమగు ప్రకాశ - మో యెఱుంగ. ౧౪
దానిలో సూర్యచంద్రులుఁ - దారకలును
మెఱుపులును బ్రకాశింపంగ - నేరవు లేద
టన్న, ఈ యగ్నియన నెంత? - అతనికాంతి
చేతనే సర్వమ్ముం బ్రకా - శించుచుండు. ౧౫

ఇది పంచమవల్లి.

# షష్ఠవల్లి

ఊర్ధ్వమూల మధశ్శాఖ - మొప్పునట్టి
యీ సనాతనాశ్వత్థమై - యొప్పు శుద్ధ
మనఁగ బ్రహ్మంబు నసఁగను, - అమృత మనఁగ
వెలయు; లోకంబులెల్లను - నిలచు నందు;
దీని నెవ్వఁడుఁ గడవంగఁ - బూనలేఁడు;
నీవు ప్రశ్నించినది యిదే - నిశ్చయంబు.
సూక్ష్మమగు నీ ప్రపంచంబు - శుద్ధమైన
బ్రహ్మమం దుద్భవిల్లు; వ - జ్రంబునటు మ
హాద్భయంబునఁ గంపంబు - నందునట్లు
వడఁకునని తెలియుచు మృతి - బడయఁబోరు.
దీనిభయమున నగ్నియు, - దీనిభయము
చేత సూర్యుఁడు దపియింపఁ - జేయుచుండు,
యింద్రుఁడును,వాయువును, మృత్యు - విట్టియైను
గురును నతనికి భయపడి - జరవుచుండ్రి.

ఈశరీరము విడువని - యింతలోనె
దానిఁ దెలియంగ శక్తుఁడు - గానివాఁడు
సృష్టిగల లోకములఁ బుట్టి - చేరుచుండు
వివిధదేహంబులను జీవుఁ - డవిరతముగ. ౪

అద్దమందునవలెఁ దోచు - నాత్మయందు;
కనులవలెఁ దోఁచును బితృలో - కమునయందు;
వెలయు గంధర్వలోకాన - జలమునందు
నట్లు, చుట్టునుముట్టి ఛా - యాతపముల
వలెను బ్రహ్మలోకంబున - వెలయుచుండు
ఇంద్రియముల పృథక్త్వంబు; - ఇంద్రియముల
సృష్టిలయములు; అవి పునః - సృష్టిఁగొనుటఁ
దెలిసి ధీరుఁడు దుఃఖంబు - వలనఁ బోఁడు. ౫

అధికమౌను మన స్సింద్రి - యములకంటె;
మనసుకంటెను సత్వంబు - మహితమగును;

మహితమా నాత్మ యంతకు - మహితమగును;
ఆమహాత్మున కవ్యక్త - మధికమౌను. ౭

వ్యాపకుండు నలింగుఁ డ - వ్యక్తజగము
కంటెఁ బురుషుండె యుత్తముఁ - డంట నిజము;
దీనిఁ దెలిసి విముక్తుఁడై - దేహి యమృత
భావముంగూడఁ దప్పక - వసయుఁగలఁడు. ౮

దర్శనంబున నుండ దా - త్మస్వరూప
మిదియుఁ జక్షువునకుఁ గోచ - రింపఁబోదు;
మనసున, మనుష్యుని హృదయ - మునను, దాని
సర్వగతముగఁ దెలిసెడి - జనులు మృత్యు
రహితులై యొప్పుచుందురు - మహిని నెపుడు. ౯

ఐఁదు జ్ఞానేంద్రియంబులు - సవల మనసు
నాత్మయం దుండుటయు, బుద్ధి - యచలయగుట
దీనినే పరమగతియని - తెలియుచుంద్రు. ౧౦

స్థిరముగా నింద్రియంబుల - వరలుచుంట
యోగమని తలంచుదు రట్టి - యోగ మెపుడు
జననము నపాయమును గల్గి - చనుటచేత
అప్రమత్తుఁడై యుండుట - యావసరంబు. ౧౧

వాక్కుచే, మనసునఁ, గంటి - వలనఁగాని
యాత్మతత్త్వంబుఁ దెలియంగ - నగునె యెందు ?
ఆస్తికుని కది తెలియంగ - నగును గాని,
నాస్తికుఁడు దానిఁ దెలియ న - నర్హుఁ డగును. ౧౨

ఉభయతత్త్వంబులను గని - యుండి, యదియు
నున్నదనువాఁడె తెలియు నా - యునికి నెపుడు:
ఉండునని తెలిసిననాఁడె - యుండుఁ దత్త్వ
మదియుఁ దిరముగ నాత్మలో - నమరియుండి. ౧౩

హృదయమును నాశ్రయించిన - యెల్లకోర్కె
లెడలిపోవఁగ మర్త్యుఁ డ - మృతుఁ డగుచును
బ్రహ్మమునుబొంది సుఖములఁ - బడయఁగలఁడు. ౧౪

భువిని నజ్ఞానబంధముల్ - పూన్కిఁ ద్రెంచు
నపుడె మర్త్యుఁడు నమృతత్వ - మందఁగలఁడు;
ఇదియె యనుశాసనంబని - యెఱుఁగుమయ్య. ౧౫
నూటనొక్కటినాడు ల - నూనము గను
హృదయమున నుండు; అందుండి - యెడలి యొకటి
మూర్ధమును జీల్చికొని దాని - మూలమునను
నూర్ధ్వగతిఁబొంది యమృతత్వ - మొందు నరుఁడు ;
మిగిలినవి యుత్క్రమణ ని - మిత్తములగు. ౧౬
పురుషుఁ డంగుష్ఠమాత్రుఁడై - పరఁగ జనుల
హృదయమున నంతరాత్ముడై - యెసఁగియుండు;
ధైర్యమున నిషీకంబును - దర్భనుండి
తీయురీతి వానిని బయ - ల్దీయవలయు
నాత్మ దేహంబునందుండి; - అదియె శుద్ధ
మంచు నమృతంబటంచును - ననఁగఁబడును. ౧౭
ఇట్లు నచికేతునకు యముఁ - డెఱుక చేసి
యున్న బ్రహ్మాత్తత్వంబును - యోగవిధిని

సర్వమును విని బ్రహ్మవి - జ్ఞాని, విరజుఁ
డగుచు మృత్యువును జయించె - నతఁడు; ఇట్లె
యన్యుఁ డధ్యాత్మమును మది - నరసెనేని
అతనివలె నమృతత్వంబు - నందఁగలఁడు. ౧౮
అతఁడు రక్షించుఁగాక మ, - మ్మతఁడ యనుభ
వింపఁజేయునుగాక, మే - మిరువురమును
గలసి వీర్యవంతులమౌచు - వెలయుచుండి,
అట్టి తేజస్వియగుదాని - నభ్యసించి,
ఒండొరులకును విద్వేష - మొదవకుండ
నుండునట్టులఁ జేయుచు - నుండుఁగాక! ౧౯

ఇది షష్ఠవల్లి

కఠోపనిషత్తు సంపూర్ణము.

శ్రీబ్రహ్మార్పణమస్తు.

ఓమ్ తత్ సత్.

# ప్రపంచమతగ్రంథమాల

## రాజమహేంద్రవరము.



### ధర్మావలంబులగు ఆంధ్రదేశీయులకు విన్నపము.

మహాశయులారా!

నానావిధ వైమనస్యములతోడను, పరస్పరద్వేషములతోడను నిండియుండి ప్రపంచము నేఁడు ప్రలయమార్గమును బట్టుచున్నది. లోకమునకు కలుగుచున్న యహితమును నివారించుటకు ఈశ్వరారాధనమే ప్రధానమైయున్నది నేఁడు మానవుల హృదయములందు మఱల నీశ్వరుని నెలకొల్పవలసియున్నది. మానవకోటిలోని యాయాజాతులవారు దేశ, కాల, పాత్రతలనుబట్టి యీశ్వరస్వరూపముల

గూర్చి యొకొక్క రీతిగనూహించియున్నారు. ఆయూ
హాలు వారివారి సనాతన గ్రంథములందు నిరూపిం
పఁబడియున్నది. క్రైస్తవులకు బైబిలు ప్రధానగ్రం
థము. మహమ్మదీయులకు కురానే-షరీఫు మూల
గ్రంథము. పారసీవారికి అవెస్తా అనునది ముఖ్యము.
బౌద్ధులకు త్రిపిటకములు ఆదిగ్రంథములు. మనకు
వేదములును ప్రస్థానత్రయమును ముఖ్యములు.
ఆయా మూలగ్రంథములు దేశభాషలలో వెలువడి
ననేగాని జనుల కాయామతముల గుఱించి తెలియు
టకుగాని, తెలిసికొని పరస్పర వైమనస్యములనువీడి
యైకమత్యముతో ప్రవర్తించుటకుగాని వీ లేర్పడదు.
కావుననే యీగ్రంథమాల స్థాపింపఁబడినది. అందు
మొదటిపుష్పమయిన కురానేషరీఫు ఆంధ్రులయా
దరణమునకు పాత్రమై యలరారుచున్నది. ఆయా
దరణమువలన గలిగిన యుత్సాహముచేత నితర

మత మూలగ్రంథములను గూడ ప్రకటింప నిశ్చ యించినాము. ఈ గ్రంథమాలలో రెండవపుష్ప గుచ్ఛముగా "అధర్వవేదమును" ప్రకటింప నిశ్చ యించినాము. ఏతద్గ్రంథప్రకటనమునకు సుమారు రు 10,000 లు పెట్టుబడి పెట్టవలసి ఉన్నది. అట్టి పెద్దపోకడకు దిగకపూర్వము కొన్ని చిన్నగ్రంథము లను ప్రకటించి, వాని విక్రయమువలన వచ్చిన ఆదాయమును పెద్దగ్రంథముల ప్రకటనమునకై వినియోగింప నెంచినాము. ఈ గ్రంథప్రకటనము చాల నష్టముతో కూడికొనియున్నదని యెఱింగియు, ధర్మప్రచారముకొఱకును, విజ్ఞానవ్యాప్తికొఱకును, ప్రయత్నింప సంకల్పించుకొన్న వారమగుటచే ఈభా రమునుపూనియున్నాము. మాయుద్యమముపట్ల ధర్మా భిలాషులగు నస్మద్దేశీయులు సాదరదృష్టిని ప్రసరింపఁ జేయురాయని యాశపెట్టుకొని, మిగిలిన విషయము లను భగవంతునికి వదలిపెట్టుచున్నాము.

మా కార్యస్థానమున దొరకు గ్రంథములు.

# కురానే షరీఫు

ఇది ముహామ్మదీయుల మతగ్రంథము. ఇందువారి మతమేగాక యాచారవ్యవహారములన్నియు వర్ణితములై యున్నవి సత్యాన్వేషణపరులును, భారతవర్షాభ్యున్నతిని గోరువారును దీనిని తప్పక చదువవలయును. ఇది ఆంధ్రవాఙ్మయమున శాశ్వతముగ నిలువఁగలదు. ముహమ్మదీయులును హిందువులును గూడ నీగ్రంథము నెక్కుడుగ ప్రశంసించియున్నారు. అనువదించినవారు రాజమహేంద్రవర కళాశాల యందు గీర్వాణాంధ్రభాషాధ్యాపకులగు

చిలుకూరి నారాయణరావుగారు,

ఎమ్. ఏ., ఎల్. టి.,

**800 పుటల గ్రంథము వెల రు. 4**

300 ప్రతులు మాత్రము మిగిలియున్నవి. నూఱు ప్రతులు చెల్లగానే ప్రతి 1కి రు 10 లు వెల పెంచబడును. గనుక త్వరపడవలెను.

గ్రంథమును గుఱించి మహాశయులును పత్రికలును నొసంగిన కొన్ని యభిప్రాయములు :-

ఖాన్ బహద్దర్ హకీమ్ సయ్యద్ అబ్దుల్ వజీద్
అనే మంజుమియాసాహెబుగారు, కడప.

కురాను గ్రంథమును తమ రాంధ్రీకరించి మహమ్మదీయ ప్రపంచముయొక్క కృతజ్ఞతకు పాత్రులయినారు. అనువాదము సులభముగాను, భావమనోహరముగాను ఉన్నది. మీ యుదారాతిశయములను శ్లాఘించుచు రు. 50 లు పారితోషికముగ బంపుచున్నాను.

ఖాన్ బహద్దర్ మహమ్మద్ హబీబుల్లాఖాన్
బహద్దరుగారు, బంగనాపల్లి ఎస్టేటు దివానుగారు:-

చాలకాలమునుండి కురాన్ షరీఫును నేనే యాంధ్రీకరింపఁ బ్రయత్నించుచుంటిని. కాని, శ్రమ యపారమగుటచే నిరాశ

చేసికొంటిని. ఇంతలో మీయనువాదమును జూడఁ దటస్థించి
నది. మీయనువాదము సర్వథాశ్లాఘ్యమై యున్నది. చక్కని
యింపయిన పాకములోపడినది. ఇస్లామునుగూర్చి తెలిసికొనఁ
గోరువారికందరకిని మీయనువాదమును చదువవలెనని చెప్పు
చుందును. ఈవిషయమై నాప్రయత్నములోప మేమియు చేయను.
మిమ్ము పరమేశ్వరుఁ డనుగ్రహించును గాక !

ఖాన్ బహద్దర్ ఎమ్. బజులుల్లాసాహేబుగారు,
సి. ఐ. ఇ., ఓ. బి. ఇ., కడపజిల్లాకలక్టరుగారు.

కురానేషరీఫుయొక్క మీయాంధ్రానువాదమును చదివి
నాను. చాల చక్కగా ఉన్నది.

హాకిమ్‌షరీఫు అబ్దుల్ కరీమ్ సాహెబుబహద్దరు గారు
అమలాపురము, గోదావరిజిల్లా.

తమరు కురానేషరీఫును తెలుగులోనికి అనువదించినందుకు నే
నున్ను నాసుతస్థులున్ను చాలాకృతజ్ఞులమై యున్నాము: ఇందు
తో రు. 50 ను పంపుతున్నాను. దయచేసి పన్నెండు ప్రతులు
పంపించండి.

ఇ. డి. మార్టినుగారు, బి. ఏ., ఎల్. టి.,

హెడ్మాస్టరు, వార్డులా హైస్కూలు, బళ్ళారి.

తమరుపంపిన కురానేషరీఫును చూచి చాలాసంతోషించినాను. అనువాద మన్నివిధములబాగున్నది. మాబడిలోని ఉపాధ్యాయులున్ను విద్యార్థులున్ను దాని చదివేటట్లు ప్రోత్సాహిస్తాను.

ఆదిరాజు శ్రీరాములుశంకరులుగారు, మొఖాసాదారు, ప్రయ్యారుపప్పేటు, కృష్ణాజిల్లా.

తాము కురానును తెనిగించినందలి యుదారహృదయమును కొనియాడుచున్నాను. ఆంధ్రవాఙ్మయమునకు నూతనాలంకారమును చేర్చుటయేకాక, మీరు తెనుగుదేశములో హిందూముసల్మాను సఖ్యతకు పునాదివేసినారు. తమకు రు 116 లు పారితోషికముగాఁ బంపనిశ్చయించినాను.

మున్షీ ముహమ్మదు ఇస్మాయిలుఖానుసాహెబుగారు, పార్సీ, అరబ్బీ, ఉర్దూమున్షీగారు

గవర్నమెంటు ఆర్ట్సుకాలేజీ

రాజమహేంద్రవరము.

చిలుకూరి నారాయణరావుగారు ఆంధ్రులు తమభాషలో

ఖురానును చదువకుండిరను కొరతను నివారించినారు. వారితో కలిసి నేను అనువాదమును సాంతముగా సావధానముదా చదివినాను. అనువాదము బహుసామర్థ్యముతో నిర్వహింపబడినది.

**ఖాజీమహమ్మద్ ఖుదురుల్లాఖాన్ ఖతీబ్, ముస్లిము**
**హమ్మద్ ఫైజుల్లాగార్లు, ఇచ్ఛాపురం, గంజాం జిల్లా.**

మేమీ యనువాదములోని కొన్ని భాగములను విన్నాము. చాలా బాగుగ నున్నవి. మూలములోని యర్థముగాని సారస్యముగాని ఇంచుకయు చెడలేదు. మాకు చాలా సంతోషమయినది. దేవుడు నారాయణరావుగారి ననుగ్రహించుగాక !

**మహమ్మద్ మొహిద్దీన్ సాహెబుగారు, కోఆపరే**
**టివు సొసయిటీల అసిస్టెంటు రిజిస్ట్రారుగారు,**
**గంజాంజిల్లా.**

నాస్నేహితులైన నారాయణరావుగారు చేసిన ఖురాను అనువాదములోని కొన్ని భాగములను మిక్కిలి యుత్సాహముతో వింటిని. చక్కని తెలుగులో మూలగ్రంథము నర్థము మనోహరముగ రచించుటయందు గ్రంథకర్త చాలా పాటుపడినారు. నారాయణరావుగారివంటి విద్వాంసులను పండితులను ఇట్టిపనికి

పూనుకొని నిర్వహించుట ముస్లిములయొక్కయు, దేశముయొక్కయు భాగ్యము.

### నవాబు మేజరు నుస్తుజా యారుద్ దౌలాసాహెబుగారు, హైదరాబాదు (దక్కను):

సాధారణముగా అనువాదములనునవి ప్రాణహీనములుగా నుండును. గాని, తమ యనువాద మట్లుగాక యతిమనోహరముగ నుండుటజూచి చాల నానంద మొందితిని. ఇట్టి గొప్ప కార్యమును సాంతముచేయుగల మీయుత్సాహమును, ఉదార హృదయమును శ్లాఘించుచున్నాను. ఈగ్రంథముకొఱకు చాల కాలమునుండియు ఎదురుచూచుచుండ తమమూలమున నిదిబయలుపడుటచేత, ముస్లిముప్రపంచమంతయుఁ దమయెడలఁ గృతజ్ఞతజూపవలసియున్నది. (మరొక ఉత్తరములో) అచ్చున్ను, బైండింగున్ను ముద్దులుమూటగట్టుచున్నవి. భాషసులభమై స్వచ్ఛమైయున్నది. తెలుగువారందరును పఠింపవలసియున్నది.

### నవాబ్ జదా ఎ. మీర్ జరుద్దీన్ గారు, కలకత్తాలో పోస్టుటెలిగ్రాఫుల అసిస్టాంటుడైరక్టరు జనరలు గారగు ఖాన్ బహద్దర్ మీర్ ముజరుద్దీనుగారి భార్య:

తమగ్రంథమును చదివించి వింటిని, చాల చక్కగానున్నది. దయయుంచి 25 ప్రతులను వి. పి, గా పంపండి. స్కూళ్ళకు బహుమాన మీయవలసియున్నది.

## హిందూ, మద్రాసు.

అనువాదము చక్కగ నున్నది. ఆంధ్రదేశములో హిందూ ముస్లిముల సఖ్యతకు తోడ్పడను.

## స్వరాజ్య, మద్రాసు.

ఈకాలమున బయల్వెడలవలసిన పుస్తకము. చిరకాలమునుండియున్న కొఱతదీరినది. హిందూముస్లిము సఖ్యతకిదే సాధనము.

## ఆంధ్రపత్రిక, మద్రాసు.

అనువాదకుని యుదారాతిశయము స్పష్టము. ఆంధ్రవాఙ్మయమున క్రీగ్రంథ మమూల్యాలంకారము.

## కృష్ణాపత్రిక, బందరు.

కరాను అనువాదము జాతీయతాతరంగములకు ఫలము. హిందూముస్లిముల కెడతెగని సఖ్యమును గూర్చుట క్రీగ్రంథము

## నీలగిరి, నల్లగొండ (నిజామురాష్ట్రము)

తమ రతిసానుభ్యముతో నిర్వహించిన కురాను అనువాద మునకు మిమ్మభినందించుచు కొంతకాలమువరకును మీగ్రంథ ప్రకటనమును మాపత్రికయందుచితముగ వేయుటకు నిశ్చయించినాము.

## మాడెర్నురివ్యూ, కలకత్తా:

సకలశ్రమలకును ధనవ్యయమునకును ఓర్చి, మహమ్మదీయ సంప్రదాయానుసారముగ, పదిసంవత్సరములు కృషిచేసి రచించిన యనువాదము. హిందూముస్లిముల కలహాలు బయలుదేరుచున్న ప్రస్తుతకాలమున వాని నణచుటకీగ్రంథము అమూల్యసహాయముగా నుండగలదు. ప్రపంచమున మిక్కిలి వ్యాప్తిజెందియున్న ఇస్లామును గూర్చి తెలియగోరువారు దీనినితప్పక కొనవలెను.

## సుప్రసిద్ధనాయకులైన సర్ మహమ్మదు షేకు గారు, లాహోరు, పంజాబు:

మీరు కురానును తెలిగించినారని తెలిసికొని మిక్కిలి సంతోషించితిని. ఇండియాలోని యాయామతములవారు పరస్ప

రాచారములను విశ్వాసములను దెలిసికొనకుండుటచేతనే నేడు విషమపరిస్థితు లేర్పడినవి. ఈయనువాదమువలన చిరవాంఛితము లగుమీ రీడేర్చినారు ముస్లిములందరును మీకు కృతజ్ఞులైయుండవలెను

# ఇతర ప్రచురణములు

---

## ఉపనిషత్తులు

(ప్రథమభాగము)

ఇందు ఈశావాస్య, కేన, ఐతరేయ, కఠోపనిషత్తుల యర్థము మనోహరములైన గీతములు, ద్విపదలు, గేయముల రూపమున రచింపబడినది. స్వామి ఆత్మానందయోగి రచించినది. వెల రు 0-6-0

## అశోకచక్రవర్తి ధర్మశాసనములు.

క్రొత్తగా కనుగొనబడిన యశోకుని ధర్మశాసన

ములతో సహా శాసనములన్నియు ఇందున్నవి. శాస నములకు సంస్కృతాంధ్రానువాదములు గలవు. ఆమహాచక్రవర్తి ధర్మవ్యాపమునకై చేసిన ప్రయ త్నము లేగాక, యానాటి చరిత్రయు నిందుమూల మునఁ దెలిసికొననగును. అశోకుని జీవచరిత్రమును, ఇతర బౌద్ధమతవిషయములును గల చక్కనియుపో ద్ఘాతము కలదు. ప్రతివారును చదివితీరవలసిన గ్రం థము. బడులలోను కాలేజీలలోను "సోర్సుబుక్కు" గా ఉపయోగించఁదగినది ఈధర్మానుశాసనమును చదివి ధన్యులుకండు. కర్త. సుప్రసిద్ధ పరిశోధకు లును, ఆంధ్రదేశీయేతిహాస పరిశోధకమండలిస్థాపకు లును, దాని ప్రథమాధ్యక్షులును అగు చిలుకూరి నారాయణరావు, ఎమ్ ఏ., ఎల్. టి., గారు.

వెల రు. 2 లు మాత్రము.

14

# గీతా తత్త్వము

——-:o:——

(అచ్చులోనున్నది)

భగవద్గీతను చదివినను ఆమహాగ్రంథమందు జీవాత్మ, పరమాత్మ, ప్రకృతి, కర్మము, మోక్షము, మొదలగు విషయములగూర్చి యనేకస్థలములలో శ్రీకృష్ణభగవానుఁడు ముచ్చటించి యుండుటచేత ప్రత్యేకవిషయములఁగూర్చి యొక్కచోట తెలిసికొనుటకు వీలగునట్లు శ్లోకము లమర్పఁబడి చక్కని యుపన్యాసముల యుపోద్ఘాతములతో ఈగ్రంథము రచింపఁబడియున్నది. గీతార్థమును స్పష్టముగా తెలిసికొనగోరువారీగ్రంథమును తప్పక చదువవలయును. స్వామి దైవతానందులవారి విరచితము.

వెల రు 1 మాత్రము.

15

రాం బో పు గ్రంథములు

# ఉపనిషత్తులు



(రెండవభాగము)

ఇందు ప్రశ్న, ముండక, మాండూక్య, తైత్తిరీయోపనిషత్తుల యర్థము ద్విపదలు, గేయములు, తేటగీతముల రూపమున వ్రాయఁబడియున్నది. త్వరలో వెలువడఁగలదు.

# అథర్వ వేదము



బ్రహ్మాండమయిన గ్రంథము. 10,000 పుటలుండవచ్చును. ఆంధ్రదేశీయులందఱును తోడ్పడినగాని

యీమహాత్కార్యము జరుగదు. గ్రంథము పూర్తియై అచ్చుకు సిద్ధముగానున్నది. ఈగ్రంథము విషయమై వివరములు తెలియఁగోరువారికి తెలుపబడును.



మాకార్యస్థానమున నీక్రింది గ్రంథములు దొరకును. రాజమహేంద్రవర హిందూసమాజము వారు ప్రకటించినవి.

## శ్రీమద్భగవద్గీత

ఆంధ్రవచనము. తేఁటతెనుఁగు. గీతార్థము అరఁటిపం డొలిచి చేతఁబెట్టినట్లుండును.

వెల రు 0—10—0 లు మాత్రము.

# స్తోత్ర త్రయము.

—:o:—

1. శివానందలహరి రు. 0-6-0 లు (అద్వైతులది)
2. ముకుందమాల రు. 0-4-0లు (విశిష్టాద్వైతులది)
3. ద్వాదశస్తోత్రములు రు. 0-6-0 లు (ద్వైతులది)

మూడు స్తోత్రములను కలిపి బైండింగు చేసినది.

రు. 0-10-0 లు. అర్థతాత్పర్యములు గలవు.

## సంగ్రహ రామాయణము.

కర్త:-బ్రి॥ శ్రీ॥ చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులుగారు. వెల రు 0-10-0 లు.

## శ్రీ వివేకానందోపన్యాసములు.

కర్త:-కీ. శే. నండూరి మూర్తిరాజుగారు.

రు. 0-10-0

కర్త:-కీ॥ శే॥ నండూరి మూర్తిరాజుగారు. రు.0-10

# సనాతనధర్మము.

---

(అచ్చులో నున్నది.)

సరిక్రొత్త గ్రంథము. హిందూధర్మమంతయు ఇందతిసులభముగ పసిబాలుర కైనను బోధపడునట్లు వివరింపఁబడియున్నది. వర్ణాశ్రమవిధానము, జీవాత్మ పరమాత్మల స్వరూపము, ప్రకృతిస్వరూపము, ద్వైతాద్వైతవిశిష్టాద్వైతమత నిరూపణము, శ్రాద్ధము, మంత్రయోగము, హఠయోగము, లయయోగము, రాజయోగము, సనాతనార్యవిద్యావిధానము, ఇట్టి విషయములెన్నియో ఈ గ్రంథమందు ముచ్చటింపఁబడియున్నవి. హిందువు లనుకొనేవారు వారున్నూ చదివితీరవలెను.

వెల రు. 1. మాత్రము.

జాతీయవిద్యానిలయమువారి గ్రంథములు.



1. ఆంధ్రవీరులు:- కర్త. సుప్రసిద్ధ పరిశోధకులగు మల్లంపల్లి సోమశేఖరశర్మగారు. వెల రు. 1-4-0

2. ప్రాచీనవిద్యాపీఠములు:- కర్త. [illegible] నారాయణరావుగారు, ఎమ్. ఏ, ఎల్. టి.,

వెల రు. 1-4-0

3. ప్రాచీనాంధ్ర నౌకాజీవనచారిత్రము:- కర్త. భావరాజు వెంకటకృష్ణారావుపంతులుగారు,

బి. ఏ, బి. ఎల్.,

4. ప్రాచీనహైందవప్రజాస్వామిక పరిభుత్వము:- కర్త. దేశభొట్ల లక్ష్మీనరసింహం పంతులుగారు, ఎమ్. ఏ., ఎల్. టి., అనంతపురకళాశాలలో చారిత్రకోపాధ్యాయులు. వెల రు 0-12-0లు.

పై గ్రంథములు వలయువారు:- జాతీయ విద్యాలయ మేనేజరు, ప్రపంచమత గ్రంథమాలా కార్యస్థానము, రాజమహేంద్రవరము.